శ్రీరస్తు

# బాణకవి

## (హర్షకథ)

మొదటి భాగము

ఓవ

రచయిత:

తట్టా రంగరామానుజాచార్యులు

సీనియర్ తెలుగు పండిట్

బోర్డు హైస్కూలు,

కపిలేశ్వరపురం, (కృష్ణాజిల్లా)

# అభిప్రాయములు

శివాయ గురవేనమః

## 1

విద్వాన్
దువ్వూరి వేంకటరమణశాస్త్రి

నందినీ మందిరము,
ఆంధ్రా యూనివర్సిటీ,
వాల్తేరు, 23-2-58.

శ్రీ తట్టా రంగరామానుజాచార్యులు రచించిన 'బాణకవి' హర్ష కథను, ఆమూలాగ్రము సావధానముగ వింటిని. బాణకథయు, హర్షకథయు నిందు సంగ్రహముగ నిరూపితములు - కథాంశములు మిక్కిలి ఆకర్షకములు- ఆనందదాయకములు.

భాష నిర్దుష్టము - సరళము, సులభము, అవశ్యకములగు వర్ణనముల సందర్భమున అచ్చటచ్చట ఔచిత్యకై దీర్ఘసమాసములు కొలఁదిగా నున్నను అవి క్లిష్టములుగావు.

పదములకూర్పు ప్రశంసాపాత్రము కాఁగలదు. ఈ గ్రంథము చూచు పెద్దలు బాణహర్షకథల నారసి యానందింతురు. బాలురు సోత్సాహముగ సలక్షణమగు భాష నభ్యసింపఁగలుగుదురు; అని నా విశ్వాసము.

(సం) దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

## 2

M. వీరేశ్వరశర్మ
సీనియర్ తెలుఁగు పండిట్

యస్. యన్. కాలేజి,
చిట్టిగూడూరు, (మచిలీపట్నం)
19-2-58.

శ్రీమాన్ తట్టా రంగరామానుజాచార్యులు రచించిన "బాణకవి - హర్షకథ" అనెడి గద్యగ్రంథమును సావధానముగా సామూలాగ్రముగ గ్రంథకర్తముఖముననే వింటిని.

సులభము, మృదుమధురము, గంభీరము నగు శైలిలో నీరచనము సాగినది. శ్రవణవ్యాపారములకు నొత్తిడి కలిగింపని సుకుమారమగు నీరచన నాకుఁ జాల నాహ్లాదమొనగూర్చినది.

కవికి సంస్కృతాంధ్రములయందుఁగల పరిపూర్ణమగు బరిచయ మిందుఁ బదపదమునఁ బ్రత్యక్షమగుచునేయున్నది. మహాకవి బాణభట్టు రచించిన హర్షచరిత్ర మాధారముగా, కథా ప్రధానముగా, నందందు నపరిత్యాజ్యములు, సహృదయశ్లాఘ్యములునగు నలఁతి యలఁతి నూతనాంశములతో నీరచయిత దీని వెలయించెను.

ఈ కూర్పునందలి మార్పు లీకవి నేర్పు, నోర్పు, దీర్పును, సర్వథా ప్రకటించుచున్నవి.

ప్రప్రథమముగా రచించిన యీచిరుతకబ్బము, భావరసగుంభితమై ముద్దులు మూటగట్టుచుఁ జదువరులహృదయము నాకర్షింపఁజాలినది.

ఇది కేవలము కల్పనాకథ కాక చరిత్రప్రసిద్ధులగు నిరువురు ప్రాచీన భారతీయ మహాపురుషుల జీవితాంశముల నభివర్ణించుటంజేసి యెల్లరకు నెల్లప్పుడు పాదేయమగుచున్నది.

ఈ కథావస్తువును రచనమున కెన్నుకొనుటయందే కవికిఁగల వివేచనము స్పష్టమై తన్నిర్వహణమునఁ జరితార్థత నందుచున్నది.

ఇది యున్నతకళాశాలావిద్యార్థులకుఁ బఠనీయముగా నిర్ణీతమగుచో నది కళార్థులకుఁ జాల విజ్ఞానప్రదము కాఁగలదని నా నిశ్చయము.

ఈ గ్రంథకర్త ఇతోధికగుణభూయిష్ఠములగు పెక్కుగ్రంథముల రచించి, స్థిరాయుశ్శ్రీ విలసితుఁడగునట్లు శ్రియఃపతి సర్వదా సర్వథా యనుగ్రహించుగాత.

(సం) M. వీరేశ్వరశర్మ.

శ్రీరస్తు.

# బాణకవి

## ( హర్షకథ )

మంగళతూర్యములు మొఱసినవి. వందిమాగధులు కైవారంబు సేయుచుండ సభ్యులెల్లరు నొక్కుమ్మడి ప్రత్యుత్థాన మొనరించి జయజయధ్వానంబులు గావించుచుండ, సరస్వతీద్వితీయుఁడై చతురాననుండు కొలువుకూటంబున కేగుదెంచి, నవరత్నమయంబగు నాసనంబు నలంకరించెను. సరస్వతియు నుచితాసనాసీన యయ్యె. సదస్యు లెల్లరు వారి వారి యాసనముల నలంకరించిరి. చామరగ్రాహిణులు వింజామరముల వీచుచుండిరి. క్షణకాలములో నాకొలువుకూటము నిస్తరంగజలధివోలె కానవచ్చెను.

నాటి యాసభకు నింద్రాదిదేవతలును, మను, దక్ష, చాక్షుష ప్రభృతులగు ప్రజాపతులును, దిక్పాలకులును, సప్తర్షులు మొదలగు ఋషిపుంగవులును, గరుడ, యక్ష, కిన్నర, సిద్ధ, సాధ్య, నాగ, కింపురుషాదు లందరును విజయముచేసిరి. పరమేష్ఠి కనుసన్న నెఱిఁగి సరస్వతి తనమృదుల హస్తంబుల వీణావాదన మొనరింప నెల్లరు భుజంగంబులట్లు శిరము లాడించుచు నానందజలధి మునిఁగి తేలుచుండిరి. వాద్య మాపబడినను, కొంతతడవు శిరము లట్లే యూగుచుండెను.

తరువాత బ్రహ్మేంద్రాదులు పరమాత్మ మాయావిలాసము లనుగూర్చి ముచ్చటించుకొనుచుండిరి.

అనంతరము కొందరుమునులు ఋక్కులను జదివిరి. మఱికొందరు యజుర్వేదమును బఠించిరి. మఱికొందరు సామ వేదమును గానమొనర్చుచుండిరి. ఇట్లుండ వారిలోవారికి విద్యావిషయికమైన వివాదములు ప్రారంభమాయెను. గొప్ప తపోనిధియు, నహంకారపూరితుఁడును, స్వభావసిద్ధముగా నతికోపిష్ఠియు, నతిక్రమమూరుఁడు నగుదుర్వాసుఁడు మంద పాలుఁ డనుమునిపుంగవునితోఁ గలహించుచు, క్రోధాంధుఁడై విస్వరముగా సామమును గానమొనర్చెను. మును లందరును శపించు ననుభయముతో వినియు విసన ట్లూరకుండిరి. కాని వాగ్దేవి స్త్రీ స్వభావంబున మనస్సు నిలుపలేక గర్వోన్మత్త చిత్తుఁడైన దుర్వాసునిగాంచి పక్కున నవ్వెను. అట్లు నవ్వు చున్న సరస్వతినిగాంచి యపరిమితకోపాకులితచిత్తుఁడై, రోషకషాయితంబులై చింతనిప్పులవలె మెఱయుచున్న కన్నుల నుండి కోపాగ్ని స్ఫులింగంబులురాల, పండ్లు పటపటంగొరకుచు. హుంకారరవంబున సభాభవనమ్ము దద్దరిల్లఁజేయుచు, ఓసి! పాపకారిణి! దుర్విదగ్ధ! వాగ్దేవి ననుగర్వముచే నప్రమేయతపోధనినై, వేదవేదాంగంబులఁ గరతలామలక మొనరించుకొని, సాటిమునులలో మేటినైన నన్నే పరిహసించుచుంటివా? ఇదే నీగర్వ మడగింతును చూడుమని కమండలమునుండి శాపజలమును బైకెత్తెను.

అప్పుడు సభలోనివా రెల్లరు హా హా కారంబు లొనరించుచుండ, మహానుభావా! శాంతింపుము, శాంతింపు మని దివిజులు బ్రతిమాలుచున్నను, గురువర్యా! పద్మజు రాణి, అబల ఈయొక్కతప్పు మన్నించుమని శిష్యులు ప్రార్థించుచున్నను, కుమారా! కామక్రోధాద్యరిషడ్వర్గం బును జయించి, శమప్రధానులైనఋషులు కోపగింపఁగూడ దని యత్రిమహాముని వారించుచున్నను, ఓదుర్వినీత! విద్యా విషయికమైన నీగర్వ మడగింతును చూడుము– "సమస్త దేవతామహిమలను గోల్పోయి మర్త్యలోకమున మానవ కాంతవై నివసింపు" మని శాపోదకమును విడిచిపెట్టెను.

ఆహా! కోప మేమి చేయింపదు? అది యుచితానుచిత ముల భావింపనిచ్చునా? పాత్రాపాత్రములఁ గననిచ్చునా? అకారణముగాఁ దనచెలిని శపించుట గాంచి, యస్తమించు సూర్యబింబంబువలె నెఱ్ఱబారిన నెమ్మొగమ్మున ముంగురు లల్లాడ, శిరఃకంపంబు గావించుచు, బింబాధరంబు లదర, మహిషాసురమర్దనివలె లేచి, ఓరీ! ఋషికుల కళంకభూత! దుర్వాస! ఇదే చూడుము– నిన్ను భస్మంబుగావించెద నని ప్రతిశాప మిచ్చుటకు నుద్యుక్తురాలైయున్న సావిత్రిని "చెలీ! కోపము నుపసంహారించుకొనుమనుచు" సరస్వతియే వారించెను.

శాపగ్రస్తురాలై చెక్కుటద్దముల బాష్పకణంబులు జాలువార వివర్ణవదనయై యున్న భారతిని గాంచి మనంబున

నక్కటికంబుగదుర పశ్చాసనుండు దుర్వాసుని గాంచి మహర్షి! ఈమార్గము సత్పురుషుల ననుసరింపఁదగినది కాదు. సమస్తమైన తపస్సులకు నోర్పు మూలముగదా! రోషదోష నిమగ్నమైన హృదయమును నిగ్రహింపవలయును. అనవసరముగా దోషరహిత యగునీవాణి నేల శపించితివి? ఇఁక నైనను గోపమును బోద్రోలి శాంతము నలవరచుకొనుమని పలికి నిజరాణి యగువాణిని వీక్షించి "వత్సా! సరస్వతి! దుఃఖింపకుము. విధిని దాట శక్యము గాదు. నీసఖి యగు సావిత్రికూడ నిన్ననుసరించి రాఁగలదు. భూలోకనివాసము నీ కానందదాయక మగును. అల్పకాలములో "నీకుమారుని ముఖకమలావలోకనానంతరము, నీకు శాపవిముక్తి కాగలదు" అని శాపాంతమునుదెల్పి యోదార్చెను.

శాపోపహత యగుసరస్వతి తలవంచుకొని పదములు తడబడ, దుఃఖపరీతస్వాంతయై సావిత్రితోఁ గలిసి యభ్యంతర మందిరంబున కరిగెను. లోకమాత యగుసరస్వతికిఁ గలిగిన వ్యసనమును జూచి సహింపఁజాలక తన వేఁడికిరణముల నుపసంహరించుకొని, పడమటికొండ నాశ్రయించి విచారించు చుండెనో యనునట్లు లోకబాంధవుఁ డస్తమించెను.

శూన్యహృదయముతో నేవేవియో యాలోచించుచు, రాహుగ్రస్తంబైన పూర్ణచంద్రునివలె వన్నెదరిగి చిన్నవోయిన ఆననంబువంచి, కన్నీరువిడుచుచున్న సరస్వతిని

జూచి సావిత్రి పొంగిపొంగివచ్చు దుఃఖము నాపుకొని "సఖి! సరస్వతి! సకలచరాచరంబులను సృజించువిధాత కనుంగు చెలివై, ముల్లోకములకు నుపదేశకర్త్రివైయున్న నీకు నే నుపదేశింప సాహసించుచుంటిని. మన్నింపుము. విధియలంఘ్య మని నీకు తెలిసియేయున్నది. జన్మభూమి విడుచుట కష్టమే. ఆప్తజనవిరహ మెవ్వరికైనను హృదయవిదారణ మొనరించును. ఐన నిట్లు దుఃఖించుట తగదు. పురాకృతకర్మ మిట్లుండగా నేడ్చి ఫలమేమి? ఏభూభాగముల నలంకరించుటకు కోరుచుంటివో చెప్పుము" అని పలికెను. సరస్వతియు "ప్రియసఖి! చేసినకర్మ మనుభవింపకతీరదు. నీతో కలిసి సంచరింపనున్న నా కీబ్రహ్మలోకవిరహము దుఃఖమును కలుగఁజేయదు. భూలోకమున నివాసయోగ్య మగుస్థానము నీవే యెరుగుదువు" అని పలికి మిన్నకుండెను.

మరునాడు సూర్యోదయమైనంతనే సరస్వతి వియోగ జలధిమునిఁగియున్న పరిజనంబుల నూరడించి, బ్రహ్మదేవునికి ముమ్మారు ప్రదక్షిణ మాచరించి, యదుగుదమ్ములవ్రాలి సావిత్రీద్వితీయయై బ్రహ్మలోకమునుండి బయలు దేరెను.

క్రమముగా నాకాశగంగ ననుసరించి మర్త్యలోకమును జేరి, ఆకాశంబుననుండియే యెల్లప్పుడు లేజిగుళ్లతోను, నెత్తావివెదజల్లు కుసుమజాలంబులతో నొప్పుచు, నెండవేఁడిమిని నేలపైఁ దగులనీయక, బాగుగా పండిపగిలిన ఫలభారం

బున వంగియుండు బహువిధవృక్షజాలంబులతోడను, పాద లపై నల్లిబిల్లిగా నల్లుకొనియుండు నానావిధములగు లత లతోఁ బెనవైచుకొని కన్నుల కానందమును, చల్లదనమును గలిగించు తమాలరసాలాది వృక్షంబులతోడను, మకరందా స్వాదనముగావించి మదించిన భృంగంబుల ఝుంకారంబుల తోడను, ఆకసంబున మేఘంబులఁగాంచి పురివిప్పి నాట్యంబు గావించు మగనెమళ్ళం జూచి, మధురమంజులధ్వనుల వీనులవిందుగావించు నెమళ్ళ కంఠస్వరంబులతోడను, కన్నుల కింపైన వివిధవర్ణములతోనుండి, మధురతరపరిపక్వఫలంబుల నారగించు కీరముల కలధ్వనులతోడను, లేఁజిగుళ్ళను గడు పారమెక్కి మనోహరమంజులారావంబులగావించు కోకిలా లాపంబులతోడను హృదయానందజనకమై శోణమని ప్రసిద్ధిఁ జెందిన హిరణ్యావాహ మనుమహానదతీరమును గాంచి, దాని సౌభాగ్యమున కచ్చెరువంది, "సఖి! సావిత్రి! ఈమహానద తీరము నా కానందమును గలిగించుచు నిచ్చటనే యుండ వలయు ననునాసక్తిని బెంపొందించుచున్నది" అని పలికి సావిత్రి యనుమతి నచటికిఁ దిగెను.

అంత నొక పరిశుద్ధప్రదేశంబున లతాగృహము నేర్ప రచుకొని కొంతసేపు విశ్రమించి, సావిత్రితోఁగూడి పూజకై వలయు పుష్పములను సేకరించెను. తన్నదనిర్మలోదకముల స్నానమొనర్చి సృష్టి, స్థితి, లయ కారకుఁడగు నాపరమా

త్మను యథావిధిగఁ బూజించి, ఫలమూలంబుల నారగించి, యాపగలంతయు గడపి, పొదరింటియందున్న శిలాతలంబున రచియింపఁబడిన చిగురుటాకు పాన్పుపై శయనించి యారాత్రి గడపిరి. ఈవిధముగనే మరుసటిదివారాత్రిములను గడుపుచుండిరి.

సరస్వతి సావిత్రితోఁ బంతంబువైచికొని వృక్షంబులకు బోదెలుచేసి నీరుబోయుచు, లతలను బ్రాకించుచు, హరిణశాబకంబులఁ బెంచుచు, చిలుకలకుఁ బలుకుల నేర్పుచు, కోకిలలతోఁ బంతంబులాడుచు, హరి మాయావిలాసంబుల నభివర్ణించుచు, బ్రహ్మలోకానుభవంబులను బూర్తిగా విస్మరించెను.

## 2

ఇట్లు కొంతకాలము గడచెను. ఒక్కనాడు సాయంసమయంబున నుత్తరదిక్కుగా నశ్వహేషాసహితఖురరవం బొందు వినవచ్చెను. సరస్వతి దాని నెరుంగవలెననుకుతూహలంబున లతామంటపంబు వెలువడి పరికించిచూడ, కృపాణపాణులు, యువకులు నైన కాల్బలముతోఁగూడిన అశ్వబృందంబునడుమ శితచ్ఛత్రముసీడనున్న పదునెనిమిదివర్షముల ప్రాయముగల దర్శనీయుఁడగు యువకుఁడు, వానిప్రక్కనున్న పండువయస్సుగల మఱియొకపురుషుఁడు గనఁబడిరి.

ఆయువకుఁడు దేవతాకృతితోనొప్పు కన్యకాయుగ ళంబును దూరమునుండియే చూచి, అనన్యసాధారణంబగు వారి లావణ్య, విలాసవిభ్రమంబుల కచ్చెరువడి కలరూపు నెఱుంగఁగోరి వారువంబుదిగి, పరిజనంబు నచ్చటనేయుండ నియమించి, ద్వితీయపురుషునితోఁగూడ నడచుచు సవినయ ముగా నావిలాసినులను సమీపించెను. ఇట్లేతెంచినవారికి సావిత్రి, సరస్వతులు వనవాసోచితంబులగు నర్ఘ్యపాద్యాది పూజల సత్కరించిరి.

ఇట్లు సత్కారములను బొంది విశ్రమించినవారలకడ కేఁగి యవనతవదనయైయున్న సరస్వతి కనుసన్న నెఱింగి, సావిత్రి సవినయముగా నాద్వితీయునిగాంచి యిట్లనియె - "ఆర్యా ! మహానుభావులగు మీరాకచే మా యాశ్రమము పవిత్ర మయ్యెను. మే మెంతయు ధన్యులమైతిమి. మా నోములు ఫలించిన ట్లానందించుచుంటిమి. మీవృత్తాంత మాద్యంతము మాచెలి వినఁగోరుచున్నది. ఈమహాత్ముని రాకచే నేప్రదేశము శూన్యముగాఁ జేయఁబడెను ? ఎచటికిఁ బోవలసియున్నది ? ఈతఁడెవరికుమారుఁడు ? తల్లిదండ్రు లెవ్వరు? ఏయక్షరంబులు వీనినామంబగుటకు నోచుకొనెను?"

అంత నావృద్ధుఁ డాయువకుని ముఖంబునఁ జూపు నిలిపి వార్ధకంబుచే ముడుతలువడినవదనంబున శోకమింత సోయగమిచ్చు మందహాసంబొనర్చి, సౌభాగ్యవతులారా !

వినుడు. "ఈతఁడు భార్గవవంశాలంకారుఁడగు చ్యవనుని పుత్రుఁడు. తల్లి సుకన్య. పేరు దధీచి. తొల్లి భార్గవవంశో ద్భవుండగు చ్యవనమునీంద్రుఁ డిచ్చోటికి సమీపంబుననుండు కమలాకరతీరంబున శుకపికశారికానినదంబులచే నతిరమ్యం బగు నొక్కయాశ్రమంబు నిర్మించుకొని, ఎండకు, వానకు, చలికి నిరుత్సాహుండుగాక, యూర్ధ్వముఖుండై, జితేంద్రియుండును, నిరాహారుండును, నిశ్చలచిత్తుండునై చిరకాలంబు నుండి తపం బాచరించుచుండెను. నిష్ఠతో తపంబుగావించు చున్న చ్యవనుని శరీరము లతావృతమై చీమలు పుట్టలు వెట్ట దొడంగెను. క్రమక్రమముగా వానిచుట్టు నాపుట్ట లధికమై కొంతకాలమున కాతనిశరీర మాపుట్టలోఁ గానరాకుండెను. తన్ను లతలును, పుట్టలును నావరించియున్నను సరకుగొనక నిశ్చలుండై చ్యవనుండు తపోనిష్ఠఁ గావించుచుండెను. ఆతని తపోనిష్ఠ కెల్లరు నచ్చెరువందుచుండిరి.

ఇట్లుండ కొంతకాలమునకు శర్యాతియను రాజపుంగ వుఁడు తన నాల్గువేలమంది భార్యలతో నాయాశ్రమంబు కొలనికి విహారనిమిత్తం బరుదెంచిన, వాని యేకపుత్రిక యనన్యసాధారణలావణ్యవతి సుకన్యయను కన్యకాలలామంబు దివ్యాంబరాభరణభూషితురాలై, సుగంధికుసుమమాలికల ధరించి విలాసమునఁ దనచెలికత్తియలతో నయ్యాశ్రమంబునఁ గ్రీడించుచు నామునిపైఁ బెట్టియుండు పుట్టసమీపమున

చ్యావనంపు పేపునఁ గ్రిందుమీదుగానక పూగుత్తులఁ గోయు చుండెను.

అట్లు పుష్పంబులంగోయుచు నా సుకన్య పుట్టలో మిణుగురులువోలె మెఱయుచున్న యతివరు నేత్రములఁజూచి, యివి యేమగునోకోయని సంశయంబువొడమ వాని నొక దర్భకొనతోఁ బొడిచెను. అంత నాపోటు గాటమై గాసిఁబెట్టఁ బుట్టలోని చ్యవనుండు కినిసి, నానావిధభూషణాలంకృతయై చిత్రాంబరమ్ములధరియించి, తొలికారు మెఱుపుబోలినదియై ప్రకాశించు లావణ్యవతి, జవ్వనియునగు నా సుకన్యను రాజ పుత్రింగాను, నవివాహితగాను నెఱింగి. మనంబు చలింప నెట్లైనను దానిఁ బరిగ్రహింపఁదలచి, నిజతపోమహిమంబుచే శర్యాతిసైన్యంబులకెల్ల మూత్రపురీషనిరోధముఁ గావించెను.

అంత నాజనపతి పరివారమంతయు బాధచే దుఃఖింపఁ దొడఁగిరి. శర్యాతి తనపరివారమున నెవ్వరైనం దెలియక యచ్చోటఁ జిరకాలమునుండి తపంబుగావించుచున్న చ్యవన మహాముని కేదైనఁ గీడుగావించిరాయనియు, లేకున్న నిట్టి నిరోధం బెల్లరకు గలుగనేరదనియు నిశ్చయించి, తన పరి వారమునడిగిన నెవ్వరును నెరుగమనిచెప్పఁగాఁ దత్కారణం బారయఁజాలక వగలం బొగులుచుండెను.

సఖీ సమేతయై సుకన్యతండ్రి పాలికింజని "తండ్రీ! నే నాయాశ్రమంబునఁ బూలఁగోయుచుఁ బుట్టలో మిడు

గురులువలె నేవో మెఱయుచుండఁగని యొక్క కుశాగ్రంబున నాపుట్టలో గుచ్చితిని. అది యేదైన నొకపురుగని తలంచి యట్లు కావించితినని'' యనగా శర్యాతి మహారా జదిరిపడి భయాతిరేకంబున దేహంబుకంపింప ''నాతల్లీ! అశ్లీలచేసితి వమ్మా! అయ్యది భార్గవుండైన చ్యవనమహామునీంద్రు నావ రించియుండు వల్మీకము. అందా మహర్షి తదేకనిష్ఠతో బహు కాలమునుండి ఘోరతపంబు గావించుచున్నవాఁడు'' అని చెప్పి యా పుట్టకడ కేఁగి దానిని మెల్లగఁ దవ్వించి యందుఁ దపస్సుచేతను, వయస్సుచేతను వృద్ధుండైన చ్యవనమహర్షిం గాంచి కరంబులు మోడ్చి సాష్టాంగప్రణామంబు గావించి, ''మునీంద్రా! నాకూతు రజ్ఞానంబునం గావించిన యపరా ధంబును మన్నింపుము. నన్ను రక్షింపుము'' అని ప్రార్థింప, నాచ్యవనుం డనుగ్రహించి ''యతిశయరూప యౌవనగర్విత యగు నీకూఁతు నాకిచ్చి వివాహముఁ గావింపుము. నీసైనికు లకును, పరివారమునకును సంభవించిన యాపద తొలఁగును; అని పలికెను.

శర్యాతి నృపాలుఁ డామునివచనంబులకు వెనుదీయక పరివారరక్షణమె పరమార్థంబుగ నెంచి, తన యేకపుత్రికయగు సుకన్యను వానికిచ్చి వివాహంబుగావించెను. వెంటనే శర్యాతి సైన్యమునకు బాధ తొలఁగెను. తనకూతు నచ్చటనే విడిచి నిజపరివారంబుతో శర్యాతి తనరాజధాని కరిగెను. పతివ్రతా

తిలకమగు సుకన్య పతివయోవృద్ధుఁడని యేవగింపక వాని మనస్సున కింపు జనించునట్లు వర్తించుచు చ్యవనాశ్రమమున కరుదెంచు నతిథులఁ బూజించుచు, పతికి సపర్యలు గావిం చుచు, చ్యవనునకు మోదావహయై యుండెను.

అట్లుండ నొక్కనా డశ్వినులు చ్యవనాశ్రమమున కేతెంచి, యొంటరిగాఁ దిరుగుచుండు నాసురుచిరాకార లావణ్యా వతియగు యువతిం గాంచి, తరుణి! నీ వెవ్వరిదానవు? ఎవనిఁ జేఁబట్టి యున్నదానవు? నీనామం బెయ్యది? అని యడు గఁగా, నాయిందువదన "పూజ్యులారా! నేను శర్యాతి భూపాలుని పుత్రికను, మహానుభావుఁడగు చ్యవనమహర్షి భార్యను, నాపేరు సుకన్య. ఇయ్యది వారియాశ్రమము" అని చెప్పగా వారు ముసి ముసి నగవులు నగి యాపూఁబోఁడి కిట్లని రి. "కోమలీ! ఇంతలావణ్యావతివి; జవ్వనివి! శోభనాంగివి నీవీబడుగుముదుసలి నెట్లు వరించితివి? ఆహా! నిర్దయుఁడుగదా నీతండ్రి. ఇంతటి ముదుసలికి నీవంటి సుకుమారి నెట్లొసంగె! అచ్చరలు సౌందర్యమున నిన్నుఁ బోలరు నీకు దివ్యవస్త్ర ములుగాని, కనకాభరణములుగాని లేకున్నను, నీమేని కాంతి యీ వనము నెల్ల మెఱుపువలె ప్రకాశింప జేయుచున్నది. నీవే రాజపుత్రునైనను జేపట్టియుండినచో, వాఁడు నిన్ను నవరత్నఖచిత భూషణాలంకృతఁగావించి, చీని చీనాంబరంబుల గట్టనిచ్చి, సమస్తభోగముల కాకరమగు రాజాంతఃపురముల

నుంచెడివాఁడు. అప్పుడు నీ సౌందర్య మింకెట్లుండునోగదా! మూఁడుకాళ్ళ ముదుసలియగుటం జేసి మేను ముడుతలువడ, నిన్నుఁ బోషింపలేని వీనివదలి మాలో నొక్కనిఁ గోరుకొనుము. ఏల వెఱ్ఱివై నీయౌవనము నడవిఁ గాచినవెన్నెలఁ జేసెదవు?'' అనఁగా వారిమాటలు సుకన్యవీనులకు ములుకులై సోఁక ''అయ్యలారా! మీరెవ్వరో? మీ మాటలు చాలింపుఁడు. నియతులైన తపోధనుల నిట్లాడఁదగునే?'' అన వారు రెండియు నిట్లనిరి. సుందరీ! ''మామహిమచే నీమగనినిఁ దరుణవయస్కునిఁ జేసెదము. మాముువ్వురిరూపము లొక్కటై కాన్పించును. అప్పుడు మా ముువ్వురిలో నీకిష్టమైనవాని నొక్కని వరింపుము.'' అనఁగా నా సాధ్వీశిరోమణియగు సుకన్య యీవృత్తాంతంబంతయు నిజపతియగు చ్యవనునకు నివేదించెను.

చ్యవనుఁడు కొంతతడ వంతరంగంబున యోజించి యందుల కొడంబడుమనఁగా నాదేవి యశ్వినులకడ కేతెంచి, యట్ల చేయుదుననెను. అంతనశ్విను లిరువురును, చ్యవనుండును ముువ్వురా సరోవరంబుఁ జొచ్చి, కృతావగాహులై యందొక్క ముహూర్తకాలంబుండి, దర్శనీయంబగు యౌవనంబున నేకాకారులై సాధ్వియగు నాసుకన్యమ్రోలనిలిచి తమలో నొక్కని వరింపుమని యడుగుటయు, సుకన్య పరమపతివ్రత గావున త్రికరణశుద్ధిగా చ్యవనుని దక్కయన్యుని

గోరనిది యగుటచేఁ బతినే ధ్యానించి, వారిలో చ్యవను నేర్ప
రచి, యతనినే వరించెను.

చ్యవనుఁ డశ్విను లొనరించిన మహోపకారంబునకుఁ బ్రహృష్టాంతరంగుండై దేవతలతో యజ్ఞముల యందింద్రుఁడు చూచుచుండగనే వారికి హవిర్భాగమును, సోమపానమును తన తపోమహిమచేఁ గావింతుననిన, వారును బరమానంద భరితులై తనకు చ్యవనునివలన దేవత్వము సంప్రాప్తియగునని సంతసించుచు నిజేచ్ఛంజనిరి. చ్యవనుండు తరుణుండై సుకన్యఁ గూడి తదిచ్ఛానువర్తియై, తనమహిమచే సకలభోగములను సమకూర్చుకొని సంతోషముతో కాలముఁ గడపుచుండెను.

ఆవృత్తాంతమంతయు విని శర్యాతి కూతునల్లునిం జూచువేడ్క చ్యవనాశ్రమంబున కేతెంచి, వారి సుందరాకారంబులఁగాంచి సంతుష్టుండై, కొమార్తెను గర్భవతిగా నెఱింగి, భర్తృగృహమునుండి స్వగృహమునకుఁ దీసికొని వచ్చెను. ఒకానొక శుభముహూర్తంబున సుకన్య యీ దీర్ఘాయుష్మంతునిఁ గనెను.

సుకన్య తిరిగి భర్తృగేహమునకుఁ బోవుచుండ శర్యాతి చిలిబిలిపలుకుల ముద్దులుమూటగట్టుచు, హృదయాహ్లాదకరుఁడగు మనుమని విడజాలక తనయొద్దనే యుంచుకొనెను. ఈ రాజీవలోచనుఁడగు దధీచి తాతగారిగృహమునందే దినదినాభివృద్ధిగాంచుచు, సమస్తవిద్యల నభ్యసించి, సకలకళల నెఱిం

గెను. క్రమముగా యౌవనవంతుఁడగు నీతనిని తాత శర్యాతి యిప్పుడు తండ్రియగు చ్యవనుని యాశ్రమంబున కనుపు చున్నాఁడు. నేనాశర్యాతిమహారాజు నాజ్ఞాకరుఁడను. భృత్యుఁడను. నాపేరు వికుక్షి యందురు. ఇచటికి రెండుక్రోసుల దూరమునందు మహనీయుఁడగు చ్యవనుని యాశ్రమము కలదు. అంతవరకే మాప్రయాణము. ఆయుష్మతి ! మేమును ఆయుష్మంతులరగు మీవృత్తాంతమును వినగోరుచుంటిమి. మిమ్ములనుజూడ దేవత లనుభ్రాంతి పీడకున్నది. కాకున్న భూలోకకాంతల కిట్టి యపురూపమగు సౌందర్య మెట్లు కలుగును. కావున మీగోత్రనామములువిన మాహృదయము లభిలషించుచున్నవి'' అనెను.

అంతట సరస్వతి ''మహాత్మా ! క్రమముగా మా వృత్తాంతమును వినగలరు. కొంతకాల మిచ్చటనేయుండి మాసత్కారములనంది మమ్మనుగ్రహింపఁగోరుచున్నాము. అయాచితోపస్థితమగు నీ స్నేహ మును మరువకుందుముగాక! అని పలికెను. అంత దధీచి ''తరుణీ ! అమృతమొలుకు నీపలుకులచే సంతసించితిమి. అందులకు మనహృదయములే ప్రమాణము. మార్గము చాలకొంచెము. పోయివచ్చెదము.'' అని పలికి వికుక్షినిగాంచి ''ఆర్యా ! పూజలచే నీమె మనల ననుగ్రహించినది. పోదము'' అని వారిచే నంగీకృతుఁడై యశ్వము నధిరోహించి సపరివారముగా వెడలిపోయెను.

అట్లుపోవుచున్న సుందరాకారుని సరస్వతి రెప్పవాల్పకయే చూచుచు నట్లే నిలబడెను. దధీచి శీఘ్రకాలములోనే శోణ మునుదాటి తండ్రియాశ్రమపదమును బ్రవేశించెను.

# 3

అశ్వములు కనుచూపుమేర మీరిపోయినను సరస్వతి యాదిక్కునే చూచుచు నిలబడెను. తరువాత కొంతతడవు నకు సావిత్రి "సఖి! రమ్ము లోనికిపోద మనుడు" సరస్వతి తెప్పరిలి దృష్టి నాదిక్కునుండి మరల్చి లోనికేగి యా దధీచినే స్మరించుచు మాటిమాటికి వాని రూపసంపదను హృదయమునఁ దలపోయుచు నాశ్చర్యపడఁ జొచ్చెను. ఆమె నేత్రములు తిరిగి వానినిసందర్శింపఁ గుతూహల పడుచుండెను.

తరువాత కొంతకాలమునకు వికుక్షి యామార్గము ననేపోవుచు సరస్వతీకుటీరమున కేఁగుదెంచెను. అట్లేతెంచిన వానిఁ గూర్చుండ నియమించి సావిత్రి ప్రీతితో నిట్లనియె- "ఆర్యా! ఆర్యపుత్రుఁడగు దధీచికి క్షేమమా? పూజ్యులగు వారితల్లిదండ్రులు కుశలముగ నున్నవారా?" అంత వికుక్షి "ఆయుష్మతి! చ్యవనకుమారుఁడు కుశలముగనే యున్నాఁడు. ఇటనుండి జనకు నాశ్రమపదంబున కేఁగినప్పటినుండియు, ననుక్షణము మిమ్ములనే స్మరించుచు, కృశించిన దేహముతో ప్రాణములను భరించుచుండెను. మీావృత్తాంతము నెఱుంగు

టకు మాలతి యనునామె శీఘ్రకాలమున నిచటికి కేతెంచగల'' దనిపలికి, కొంతతడవట్లే విస్రంభాలాపములాడుచునుండి వికుక్షి తనదారినబోయెను.

మఱునాఁడు గభస్తిమాలి యుదయాద్రిని దోఁతెంచుడు సరస్వతి కాలకృత్యములఁ దీర్చుకొని బహువిధవికసిత కుసుమగుచ్ఛంబుల జగన్నాథునిబూజించి, యుటజాంగణంబున లేడిపిల్లలతో నాడుకొనుచుండ, చ్యవనాశ్రమమునుండి వచ్చుమాలతి శోణమునుదాటి సరస్వతిని సమీపించి, దూరమునుండియే శిరమువంచి నమస్కరించెను. ఆనూతన వ్యక్తినిగాంచి, వికుక్షిమాటలు జ్ఞప్తికిరాఁగా సావిత్రియు నచటికివచ్చి నిలిచెను. అంత మాలతి సరస్వతినిగాంచి ''దేవీ! నీకు రహస్యముగాఁ జెప్పవలసినవిషయ మొండు గలదు. అవకాశమిప్పించఁ గోరుచుంటినని మెల్లగాఁ బలికెను. అదివిని సరస్వతి ''అమ్మా! ఏల యిట్లుమాట్లాడుచుంటివి? నీకు నేను సర్వథా విధేయురాలను. చెప్పవలసినదంతయు నిర్భయముగాఁ జెప్పు'' మనెను.

ఆముప్పురును సహకారవృక్షంబుక్రిందనున్న శిలాఫలకంబుపై నాశీనులైరి. అప్పుడు మాలతిముఖంబున విచారరేఖలు పొడసూప దేవీ! ''అచిరంజీవి దధీచి మాయాశ్రమమునుండి మాకడ కేతెంచినదిమొదలు స్థిమితముగఁ గానరాడు. ఎల్లప్పుడు పరధ్యానముతో నుండును. ఆహారాది

కములను గొనడు. గగనవీధిని బరికించుచు నుస్సురనును. సగముతేయి గడచినను గన్ను మూయఁడు. కన్ను మూసెనా నేమేమో కలవరించుచుండును. వానిస్థితి మా కాందోళనము కలిగించుచుండెను. దినములు గడచినకొలఁది దధీచి శరీరస్థితి మఱింత వేదనాకరమగుచుండెను. దీని కంతకును గామవికారముదక్క వేరొకటికారణముగాదని తోఁచి, యాతనివలననే కొంతకుఁగొంత హృదయగతం బెఱింగి తత్ప్రాణరక్షణకై నిన్ను బ్రార్థింప నేఁగుదెంచితిని'' అని పలికెను.

సావిత్రి సరస్వతు లొకరిమొగ మొకరు చూచుకొనిరి. విషయమేమో తమకుఁ దెలిసిపోయున్నది. అంత సరస్వతి మాలతింగాంచి లజ్జావనతవదనయై అమ్మా! ''అధికముగా మాట్లాడఁజాలను. ఇదే నీమాటయందు నిలుచుటకు సిద్ధముగానుంటి'' నని బదులుచెప్పెను. మాలతి పరమానంద భరితయైవారి సెలవుగైకొని చ్యవనాశ్రమమునకుఁ బోయెను.

ఆకాంతాలలామంబు లిరువురును భావపరంపరలు హృదయాంబుధిఁ జెలరేగఁ గొంతతడ వట్లెకూరుచుండిరి. సరస్వతిమనంబున నూతనానుభవం బొందుకనుపట్టెను. తఱి యెఱిఁగి కుసుమసాయకుఁడు సపరివారముగ నాయాశ్రమమును బ్రవేశించి దాడిసాగించెను. కాలముగడచుట కష్టతరమయ్యెను. సరస్వతి మాటిమాటికి నాకసమువంకను, శోణనదమువైపునకును జూడ మొదలిడెను. సావిత్రి తమకు

భూలోకనివాసమున కవధిరానున్నదని మనంబున సంతసింపఁ దొడంగెను.

సరస్వతికి ప్రకృతియంతయు వ్యతిరేకమైన ట్లుండెను. పుంస్కోకిలరుతంబులు, మత్తభ్రమ్మంధయమ్ముల ఝంకారం బులు కర్ణకఠోరంబులై సంతాపంబు గావించుచుండెను. లతా గృహంబుఁ జేరి క్షణ మొకయుగముగా గడుపుచుండెను. ఎట్టకేలకు సూర్యుఁ డస్తాద్రిశిఖరంబు నధిరోహించెను. క్రమముగ జీకట్లను బారద్రోలి వృక్షముల చాటునుండి సరస్వతిఁ జూచుచుండెనో యనునట్లు, అంబరమున ద్విజ రాజు నేత్రపర్వ మొనరించుచుండెను.

జననాశ్వము నధిరోహించి శోణమునుదాటి దధీచి మాలతీద్వితీయుఁడై సరస్వతీనివాసమున కేతెంచెను. సర స్వతీ దధీచు లొకరిపైనొకరు క్రీగంటిచూపులఁ బ్రసరింపఁ జేసిరి. అదియొక పరిమోదపరిపంచము. అప్పుడు వారి హృదయము లెట్లుండునో? ఏమో? ఎవరు చెప్పగలరు? అది అనుభవైకవేద్యము. లజ్జావతనవదనయై దధీచిపై వాల్చూపులు నిగుడ్చు సరస్వతి కనుదమ్ములలోని భావ మును దధీచి చెప్పవలయును. ఆయనుభూతియందున్న సర స్వతి చెప్పవలయును. కొంతతడవు మనోహరములగు సం భాషణలతోనుండి, సరస్వతీద్వితీయుఁడై దధీచి యా పండు వెన్నెలలో నదీసైకతస్థలుల, ఆకులు కానరాకుండ పుష్పించి,

వింతవింత పరిమళములను వెదజల్లు లతానికుంజంబుల విహరింపఁబోయెను.

ఇట్లాయిరువురికి సంవత్సర మొకరోజువలె గడచిపోవు చుండెను. తరువాత సరస్వతి గర్భమునుదాల్చి, యొక్క-శుభ ముహూర్తంబున సర్వలక్షణలక్షితుఁడగు కుమారుని గనెను.

కుమారుని ముఖకమలమును వీక్షించినంతనే దుర్వా సుని శాప మస్తమింప దివ్యజ్ఞానమేర్పడెను. వెంటనే దధీ చికి తన వృత్తాంతమంతయు సాకల్యముగఁ జెప్పి, వియో గమును సహింపఁజాలక కంటికిమంటికి నేకధారగా విల పించు దధీచి పాదపద్మములఁ దన యమృతహస్తముల స్పృశించి, కుమారునకు సమస్తవేదములు, సర్వశాస్త్ర ములు, సకల కళలు నాయనుగ్రహమువలన నావిర్భవింప గలవని వర మొసంగి, నిజపతికి సుతు నప్పగించి, పితా మహుని యాజ్ఞాప్రకారము సావిత్రీద్వితీయయై బ్రహ్మ లోకమున కేఁగెను.)

# 4

సరస్వతికిఁ బుత్రుఁ డుదయించినసమయమందే భార్గవ వంశమున దధీచి పినతండ్రిభార్య యగు నక్షమాలయను మునికాంతకు నొక కుమారుఁ డుదయించెను. దధీచియుఁ బ్రళయకాలపయోధివలె నుప్పొంగు వియోగదుఃఖాంబుధిని

కొంతకాలము నిమగ్నుఁడై యుండి, గుండె రాయిచేసికొని, యెట్టకేలకు దుఃఖమును దనకుదా నుపశమింపజేసికొని, తనపుత్రునిఁ బోషింపుమని యక్షమాలను బ్రార్థించి, యా బాలు నామెహస్తంబుల నునిచి తపంబొనర్చి విరహాగ్ని నార్పనెంచి తపోవనమునకుఁ బోయెను.

అక్షమాలయు నా పసికందులను భేదము లేకుండ పెంచుచుండెను. వారిలో సరస్వతికుమారుఁడు సారస్వతుఁడు. రెండవవాఁడు వత్సుఁడు. ఆబాలు రిరువురును శుక్లపక్ష చంద్రులవలె దినదినాభివృద్ధిగాంచుచు బాల్యమునుండియు నన్నదమ్ములవలె నన్యోన్యానురాగముల వర్ధిల్లుచుండిరి. సారస్వతునకుఁ దల్లి వరప్రసాదమువలన విద్యలన్నియు బాల్యముననే కరతలామలకము లయ్యెను. వత్సునకు యుక్త వయస్సు వచ్చినప్పటికి వేదములన్నియు సారస్వతుఁడే వానికి బోధించెను.

తరువాత సారస్వతుఁడు యౌవనవంతుడగు వత్సునకు కోమలాంగియగు నొక్కమునికన్యకనిచ్చి వివాహము చేసి, యాప్రదేశమునందే ప్రీతికూటమను పేరుగల యొక గృహమునందు వారు నివసించునట్లు చేసెను. అంతట తాను బ్రహ్మచారియై తపం బొనరింప నిశ్చయించి, దండము, కృష్ణాజినము, వల్కలము, మౌంజి ధరించి తండ్రియగు దధీచి తపస్సుచేసికొను ప్రదేశమున కేగెను.

అటుతరువాత వత్సునివంశము ప్రవర్థిల్లెను. వత్సుని కుమారుఁడు వాత్స్యాయనుఁడు. వాత్స్యాయనున కచ్యుతుఁడును, వానికిఁ గుబేరుఁడును, కుబేరునకుఁ బాశుపతుఁడును, వానికి సర్థపతియు, సర్థపతికి చిత్రభానుఁడను కుమారుఁ డుదయించెను.

చిత్రభానుఁడు సకలవిద్యాపారంగతుఁడై వెలయుచు, రాజదేవియను గన్యకను వివాహమాడి యామెతో నిష్టోపభోగంబు లనుభవించుచుండెను. కొంతకాలమునకు రాజదేవి గర్భమునుదాల్చి, నవమాసంబులు నిండినంతనే, సకలలక్షణలక్షితుఁడై ముఖంబున బ్రహ్మతేజం బుట్టిపడ, దర్శనీయుండగు బాలునిఁ గనెను. ఆబాలుని శుభలక్షణములఁ గాంచి యెల్లరు నాశ్చర్యపడఁ జొచ్చిరి. ఒక శుభముహూర్తంబున వానికి "బాణు" డని నామకరణంబు గావించిరి. కాని వంశోద్ధారకుఁడగు నాబాలుని స్వయముగాఁ బెంచుకొను భాగ్య మాతల్లికి లేకపోయెను. దురదృష్టవంతురాలగు రాజదేవి యల్పకాలముననే యాపసికందును మాతృహీనునిగాఁ జేసి దివంబు నలంకరించెను.

చిత్రభానునకుఁ దన కుటుంబస్థితి యంధకారబంధురమయ్యెను. ఖేదమోదములురెండు నొకేపర్యాయము తన్నావరించెను. ఒకవంక భార్యావియోగ దుఃఖము, మఱి [illegible] కుమారుఁడగు బాణుఁడు. ఎట్టకేలకు దుఃఖము

నణచినైచికొని తల్లియుఁ దండ్రియుఁ దానయై ప్రేమతోఁ బుత్రుని బెంచుచుండెను. భానుఁడు శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిగాంచుచు, దండ్రికడ విద్యలనెల్ల నేకసంథాగ్రాహియై యభ్యసించుచుండెను. చిత్రభానుని యానంద మున కవధి లేదు.

శాస్త్రప్రకారము భానునకు చౌలోపనయనాదులను గావించి వేదపాఠము నారంభించెను. భానునికి పదునాల్గు సంవత్సరములు వచ్చుసరికిఁ జిత్రభానుఁడు వ్యాధిగ్రస్తుఁడై విధి నతిక్రమింపఁజాలక యసహాయస్థితియందున్న బాలు నొంటిగావిడచి స్వర్గ మలంకరించెను. ఆహా! దైవమాయ! విధి సర్వసక్తివంతముగదా! దాని నెఱుంగ నెవ్వరికి సాధ్యము! చిత్రభానుఁడు తనకుమారు నెంతవానిని జేయఁ దలచెనో? ఏమేమి భావించెనో? పురుషప్రయత్నముయొక్క సాఫల్యవైఫల్యము లావిధి యధీనములుగదా!

పితృమరణము వజ్రఘాతమై యాబాలుని హృదయ మును భేదించెను. భానుని దుఃఖమున కవధిలేదు. రోజులు గడచుట కష్టతరముగా నుండెను. ఎట్లో యతికష్టముగాఁ గొన్నిరోజులు గడచెను. భానుని జీవితము జలధిమధ్యనున్న యరిత్రములేని నావయయ్యెను. క్రమముగా శోకము సన్న గిల్లుచుండ స్వాతంత్ర్య మేర్పడుచుండెను. కొందరు విద్యా విహీనులు, దురాచారపరాయణులు నగుబాలురతో స్నేహ

మేర్పడెను. బ్రహ్మచారి, స్వతంత్రుఁడు – దుష్టసహవాసము. ఆహా! ఇంక నేమికావలయును. అవినీతుఁడై దుష్కృత్యములఁ గావించు దుర్మార్గులగు స్నేహితులతోఁగూడి కొంత కాలము గడపెను.

భానుని మిత్రులందరు నన్నివిధముల పతితులైనవారే వారు స్వేచ్ఛాప్రియులు. దొంగతనము, జూదము, వేశ్యాలోలత్వము, మద్యపానము వారి నిత్యకృత్యములు, కుమారులను మంచిమార్గములో నుంచనెంచిన వారి తల్లిదండ్రులు విసిగి వేసారి నిరాశాపరులైరి. భానుఁడు పిత్రార్జితమైన మాన్యములు, ధనము, కలవాఁడగుటచే వారు నెమ్మదిగా భానునితో మైత్రి నెఱపుచు వానిధనమును లాగ నారంభించిరి. బాల్యమునుండియు సత్ప్రవర్తనగలవాఁడగుటచే మిత్రుల ప్రవర్తనలు భానునకు నచ్చెడివికావు. అయినను వెనుక నెవ్వరును లేనివాఁడగుటచే వారితోఁ దిరుగాడ నారంభించెను.

ఆ గ్రామము వెలుపలనున్న పాడువడిన దేవాలయములో జూదమాడుట వారికలవాటు. భానునిఁగూడ నచటికిఁ గొనిపోయి పాచికల నాడింప యత్నించిరి. కాని లాభము లేకపోయెను. వారు జూదమాడుచుండ భానుఁడా శిథిలదేవాలయమునందలి విగ్రహములను దర్శించుచు, బాల్యమునఁ దండ్రి బోధించిన స్తోత్రపాఠములను బఠించుచు, నచట్టి

ప్రకృతిదృశ్యములను, శిల్ప రామణీయకమును దర్శించి, యానందాతిశయంబున మైమఱచి నూతనశ్లోకంబుల నల్లుచు, నడుమ నడుమ పాచికలాడుచుఁ గలహించు కొనుచుండు మిత్రుల వివాదంబులఁ దీర్చుచు కాలము గడుపుచుండెను.

బాణునిధనమున కీదుర్మార్గులు చీడపురుగులైరి. పిత్రార్జితమగు ధనము కర్పూరమువలె నానాటికి హరించుచుండెను. మిత్రుల బలవంతముమీద బాణుఁ డొకనాఁడు వేశ్యావాటి కేఁగవలసివచ్చెను. ఎవరైన జూతురేమోయను భయమున హృదయము తటదట కొట్టుకొనుచుండ వెనుక ముందులు బరికించుచు, స్నేహితుల నడుమనడుమ నడచుచు, మదవతియను వేశ్యాగృహమునఁ బ్రవేశించెను. ధనాశచేఁ గపటప్రేమ నటించుచు, మానాభిమానముల నమ్ము వారకాంతను, విటుల రక్తమాంసములఁ బీల్చి పిప్పిఁ గావించు వేశ్యమాతలను, గాంచినంతనే బాణునకు తలపైఁ బిడుగు పడినట్లయ్యెను. ఆహా! సీత, సావిత్రి, అనసూయ మొదలగు పతివ్రతామ తల్లు లుద్భవించిన పవిత్రభూమియం దిట్టి కులట లుద్భవించిరిగదా! అని పరిపరివిధములఁ దలపోయుచుండెను. మదవతి వాల్చూపులు నిగుడించుచుఁ, దనహావ, భావవిలాస విన్యాసములతో బాణుని లోఁగొనజూచుచు, నెట్లయినను వానిచే మద్యపానంబుఁ జేయింపనెంచి చేసిన ప్రయత్నము లన్నియు వ్యర్థములయ్యెను. మోక్షగామి భవబంధము లను

ద్రెంచుకొని పరతెంచు విధమున బాణుఁడా మోహపాశము లను విదలించుకొని యెట్లో వేశ్యాగృహమునుండి బయట పడెను.

బాణుని ప్రవర్తనయంతయుఁ దాటికిఁద పాలు త్రాగిన చందమయ్యెను. వాని వంశమర్యాదల నెఱింగిన పెద్దల కీ ప్రవర్తన హృదయశల్య మయ్యెను. కొందఱు వానిని మందలింప యత్నించిరి. కాని యేమిప్రయోజనము? బంధువు లెల్లరు వాని నేవగించు కొనఁజొచ్చిరి. ప్రాయికముగా యౌవనారంభ మెట్టివారినైన నట్టెట్టుచేయుచుండును. కితవు లగు మిత్రులతోఁగూడి యౌవన మదోన్మత్తుఁడై తిరుగాడఁ జొచ్చిన బాణుఁడు లోకమునకుఁ బరిహాస పాత్రుఁడయ్యెను.

ఒకనాఁడు బాణుని వంశవృద్ధుఁ డొకఁడు తిన్నెపైఁ గూర్చుండి యామార్గమునఁబోవు బాణునిఁగాంచి చేరఁ బిలిచి, నాయనా! కూర్చుండుమని దగ్గరకుతీసి కౌఁగిలించు కొని పెద్దపెట్టున నేడ్చుచు. "తాత! మనవంశమర్యాద లెట్టివి? నీతాతతండ్రు లెట్టివారో గమనించితివా? ఒక్క సారి కన్నువిప్పిచూడుము. నీతండ్రి చిత్రభానుఁడు తల్లిలేని నిన్ను కష్టపడి యెట్లు పెంచి పెద్దవానిఁ జేసెనో పరికించితివా? "నాతనయుఁడు వంశోద్ధారకుఁడు, సద్గుణరాశి, చదువుల సరస్వతి, యని చెప్పుచుండెడివాఁడు. నీవిట్లు తిరుగుచుండిన పితృదేవతలకు నుత్తమలోకములు గలుగుటెట్లు? నీతండ్రి

మనంబున కెట్లు శాంతిచేకూరును. నీవును పసిబిడ్డవు గావు. సర్వము నెఱిఁగినవాఁడవు. బాగుగ నాలోచించుకొనుము'' అని విలపింపదొడఁగెను. బాణునకు తలతిరిగి పోవుచుండెను. ఏమియు మాటలాడకయే యింటికితిరిగి వచ్చెను. హృదయము ప్రళయకాల పయోధివలె కలగుండు పడుచుండెను. అనుక్షణ మావృద్ధుని పలుకులు గృహమంతయు మారు మ్రోగుచుండెను.

నేలపైఁ గూలఁబడి ''పవిత్రమగు నావంశంబున కేర్పడిన కళంకము నెట్లు పోఁగొట్టుకొందును. ఎందుఁబోదును ? ఏమిచేయుదును ? అని విలపింపఁ దొడగెను. పూర్వజన్మ సుకృతవిశేషంబునఁ బూర్వికుల పుణ్యచరిత్రలను దలపోసికొని, యిచ్చటనే యున్నచోఁ బ్రయోజనము లేదని నిశ్చయించి, తండ్రి తాతలు సంపాదించిన ధనము కలవాఁ డగుటచేతను, చదువవలసిన శాస్త్రము లుండుటచేతను, గృహమునుండి బయలుదేరెను.

క్రమక్రమముగ దేశాటనంబుఁ గావించుచు, బ్రసిద్ధంబులగు గురుకులంబులను దర్శించుచు, విద్యాపారంగతులగు గురువులవలనఁ దన కాయాశాస్త్రములందు గల సందేహములఁ బాపుకొనుచు, వాదోపవాదంబుల వారు దిగ్భ్రాంతు లగునట్లు చేయుచుండెను. మహాపండితు లందరును బాణుని పాండిత్యప్రకర్ష కబ్బురపడుచుండెడివారు.

బాణునకు సమస్త శాస్త్రములు కరతలామలకంబు లగుటయే కాక, కవనమునందు ధారాశుద్ధియు నేర్పడెను. నిష్కామయోగులగు పండితశ్రేష్ఠు లీతనిగాంచి "అపరసరస్వతి" అని పొగడఁజొచ్చిరి. బాణుని కీర్తిలతలు దేశమునందంతటను బ్రాకఁజొచ్చెను. రాజసభలయందు పండితులతో వాదోపవాదంబులు జరుపుచుండ బాణుని పాండిత్యధాటికి నాటిపండితులు నిలువలేకపోయిరి. అందువలన బాణునిశక్తి నైపుణ్యములు పండిత ప్రకాండులకు శ్లాఘనీయమును, పండితమ్మన్యుల కసూయా జనకము లయ్యెను. అయిన నేమి? వాని పాండిత్యమున కేమి కొఱఁత?

బాణుఁడు తన పూర్వీకులవలెనే పాండిత్యమును, ప్రఖ్యాతియు నార్జించి తిరిగి జన్మభూమికిఁ జేరెను. బాణుని కీర్తివినియున్న బంధు మిత్రులందరును, చాలకాలమునకుఁ దిరిగివచ్చిన వాని నెక్కువగా నాదరించిరి. బాణుఁడును మహదానందంబున మునిఁగి, బంధుగృహంబులం దిరుగుచు, దేశాటనంబునఁ గాంచిన గురుకులముల గూర్చియు, రాజాస్థానములఁ గూర్చియు వింత వింత కథలను వారలకుఁజెప్పుచు, సంతోషముతోఁ గాలమును గడుపుచుండెను. చిత్రభానుఁడు మరణించినతరువాత బాల్యచాపల్యమునఁ దిరుగు బాణుని గాంచి పరిహసించిన బాంధవప్రముఖు లెల్లరు నిప్పు డవమహమికతో బాణుని వివాహప్రయత్నములుగావించుచుండిరి.

## ౫

ఒకనాటి మధ్యాహ్న సమయంబున బాణుఁడు తనగృహంబుననొక గ్రంథమును బఠించుచుండెను. అది గ్రీష్మ సమయంబగుటచే సహస్రకిరణుఁడు దుర్నిరీక్ష్య తేజుఁడై వేడి కిరణములను భూమండలమునఁ బ్రసరింపఁజేసి యాకసమున వెలుగొందుచుండెను. అప్పుడు బాణుని తమ్ముఁ డింద్రసేనుఁ డరుదెంచి అన్నా! "రాజాధిరాజ శ్రీహర్ష చక్రవర్తి సోదరుఁ డగు శ్రీకృష్ణునిచే నీదగ్గరకుఁ బంపబడిన భృత్యుఁడు ద్వారదేశముననున్నవాఁడు. మీదర్శనము నభిలషించుచున్నాఁడు" అనిచెప్పి బాణునాజ్ఞఁగైకొని యాతని తీసికొనివచ్చెను. వాఁడును దూరమునుండియే నమస్కరింప, "నాయనా! కృష్ణుఁడు సుఖముగానున్నాఁడా?" అని బాణుఁడు ప్రశ్నించెను. వాఁడును "మహాశయా! పూజ్యుఁడగు కృష్ణస్వామి సుఖముగానున్నారు." అనిపలుకుచు గ్రీష్మాతపమున కాయాస పడుచు సమీపమునఁ గూర్చుండి, "ఇదిగో స్వామియగు కృష్ణునిచేఁ బంపబడిన లేఖ" అని చేలాంచలమునుండి ముడి విప్పి బాణుని హస్తమునం దుంచెను.

బాణుఁ డాదరముగా నాలేఖనుగైకొని తనలోఁ దానిట్లు చదువ నారంభించెను. "మేఖలకునివలన సమస్తవిషయముల నెఱింగి తడయక బయలుదేరి రావలయును. మిగిలిన విషయములను సమక్షమున మాట్లాడుకొందము" అని.

మేఖలకుని ముఖలక్షణములనుబట్టి యేకాంత మభిలషించుచున్నట్లు గ్రహించి, పరిజనమును దొలగించి "మేఖలకా! కృష్ణస్వామి సందేశమును సాకల్యముగఁ జెప్పుము."

ఆర్యా! అవధరింపుము "మీతో నాకుఁ గలమైత్రి యత్యల్పము. ఐనను సరస్వతీ లీలావతారుఁడవగు నిన్ను విడిచి యుండుట చాలకష్టముగానున్నది. నీశాస్త్రవైదుష్యమునన్ను మంత్రముగ్ధుని గావించినది. నీవులేకుండుట నాకేమియుఁ దోఁచుటలేదు. నాహృదయము నీవెఱుంగనిదికాదు. పరోత్కర్షాసహిష్ణువులు కొందరు నీవు దుర్మార్గుఁడవనియు వేశ్యాలోలుఁడవనియు, కపటపండితుడఁ వనియు, చెవినిల్లు కట్టుకొని ఘోషింప మొదలిడిరి. శ్రీహర్ష మహారాజు నమ్మినాఁడు. నీవునిజముగా దుర్జనుఁడవుగావుగదా! నీకీర్తినిగాంచి సహింపలేనివారు, రాజుకడకేతెంచి దుర్బోధఁజేసిరి. రాజేమిచేయును? నేనది సహింపలేక పోయితిని. నీగుణగణముల నభివర్ణించితిని. నీపాండిత్యము నుగ్గడించితిని. బాల్యచాపల్యమున దుష్టసహవాసము చేసియుండవచ్చును. ఇప్పుడు బాణుఁడు మహాకవి, మహాపండితుఁడు. అతనిం బిలిపింతును. మీరే స్వయముగాఁ బరీక్షింపుఁడని మొఱఁబెట్టితిని. మహారాజు మనస్సు కొంచముగా మారినది. కావున నీవు వెంటనేబయలుదేరిరమ్ము. అని మేఖలకుఁడు చెప్పగా విని, చిత్రసేనుం గాంచి "వీనికి మజ్జన భోజనాదికముల నేర్పాటుగావించి, విశ్రమింపఁ జేయు

మని పలుక, వల్లెయని మేఖలకుని దోడ్కొని చంద్రసేనుఁ డరిగెను.

ఆరాత్రి శయనాగారంబున భానుసిద్ధికి యగమ్య గోచరమయ్యెను. భావపరంపర లోకట్టమ్మడి చెలరేగెను. "ఏమిచేయుదును? మహారాజుచే దుర్జనునిగా భావింపఁబడి తిని. కృష్ణునితో నాకంత గాఢస్నేహ మేమున్నది? రెండు మూఁడు రోజు లొకచోట కలిసియుండుటయేగదా! నాపై వానికంత యభిమాన మేలకలిగెను? అచటికేఁగిన నేమి జరుగునో? ఎట్టి యవమానమును బొందవలసివచ్చునో? పోకున్న కృష్ణునిమాట వీటిబుచ్చినవాఁడ నగుదును గదా! ఇప్పు డేమిచేయుదును? ఎన్నివిధముల యోజించినను కర్త వ్యమును నిర్ణయింపఁ జాలకుంటినే? భక్తక్షేమంకరుఁడగు శంకరుఁడు నన్నేల యనుగ్రహింపఁడు? అని పలువిధములఁ దలపోసి తలపోసి తుట్టతుద కెట్టులైనను పోవుటకే నిశ్చయిం చెను. ఈ నిర్ణయమునకు వచ్చుసరికి తొలికోడి కూసినది.

మరునాఁ డరుణోదయమునకుఁ బూర్వమే కాలకృత్య ములఁ దీర్చి, స్నాన మాచరించి విభూతిరేఖలు ధరించి, సంధ్యావందన మాచరించి, అక్షమాలఁ గైకొని మంగళ సూక్తములఁ బఠించి, దేవదేవునిఁ బూజించి, యథావిధిగ హోమకార్యముల నెరవేర్చి, బ్రాహ్మణులనుఁ బూజించి, భూరిదక్షిణ లొసంగి, వారి యాశీర్వాదముల స్వీకరించి,

తెల్లనివస్త్రములఁ ధరియించి, మేనత్తయగు మాలతికి నమస్క రించి, యామె మంగళవాక్యములు పలుకుచుండ, కుడిపాద మును గుమ్మమునుండి బయటపెట్టుచు ప్రీతికూటమునుండి మేఖలకునితో బయలుదేరెను.

సాయంకాల మగునప్పటికి మల్లకూట మనగ్రామముఁ జేరి, యాప్తమిత్రుఁడును, సోదరప్రాయుఁడు నగు జగత్పతి యను బ్రహ్మణోత్తమునియింట నాతిథ్యంబు స్వీకరించి. నాఁడు సుఖముగా కాలముగడపెను. మరునాఁడు గంగానదీ తీరముననున్న యష్టియను వనగ్రామముననుండి మూఁడవ రోజున స్థానేశ్వరమును జేరెను.

బాణునిరాక విని కృష్ణుఁ డెదురుగావచ్చి సాదర ముగ నమస్కరించి, యుచితాసనము నలంకరింపఁజేసి కుశల ప్రశ్నములను గావించెను. ఇట్లు కొంతతడ విష్టగోష్ఠి జరిపి, రాజభవనంబునకు సమీపముననున్న సుందరభవనంబున విడియించి, పూజాదికములకు వలయు సౌకర్యములఁ గావించు వారల నియోగించెను.

బాణుఁడు మజ్జన భోజనాదికములఁ గావించి, సుఖా సీనుఁడై యున్నతఱి, మేఖలకుఁడు రాజాజ్ఞ గైకొని ద్వితీయ పురుషునితో నరుదెంచి దూరమునుండియే సవినయముగ నమస్కరించి పూజ్యుఁడా! "ఈతఁడు పారియాత్రికుఁ డను దౌవారికుఁడు. రాజానుమతంబున మిమ్ములను మహారాజ

దర్శనంబునకుం గొనిపోవచ్చినాడు" అని విన్నవించెను. బాణుఁ డానందపరవశుఁడై, ధన్యుఁడ నైతినని పలికి దౌవారికు ననుసరించెను.

అంతదౌవారికుఁడు మార్గముఁ జూపుచుండ, సమున్నత సౌధరాజంబులతో నొప్పు రాజమార్గంబుదాటి, రాచనగరు ప్రవేశించి, కక్ష్యాంతరముల నతిక్రమించి, యొక్క రమణీయమందిరమున మంత్రి సామంత పరివృతుండును, సుఖాసనాసీనుండునగు శ్రీహర్ష మహారాజుఁ గాంచెను. పారియాత్రికుఁడు మోకరిల్లి మహారాజ! పూజ్యుఁడగు బాణుఁ డరుదెంచియున్నాఁడు" అని విన్నవించెను బాణుఁడు యజ్ఞోపవీతమును సరిదిద్దుకొని శిరమువంచి మహారాజునకు నమస్కరించి

శ్లో॥ సమస్త సామన్త నరేంద్రపాళి
మాణిక్య రోచీరుచిరాంఘ్రిపద్మ
బహూపదానందిత పండితేంద్ర
శ్రీహర్ష విద్వన్నుత తేఽస్తుభద్రమ్.

అని స్వస్తివాక్యములను బలికెను. మహారాజేమియు మాట్లాడకయె దృష్టినావలకు మరల్చి చేరువనున్న మాళవ రాజకుమారునితో "నీతఁడే బాణుఁడు, మహావిటుఁడు అని పలికెను.

బాణుఁడు దండతాడిత భుజంగంబువలె శిరముపైకెత్తి నేత్రాంచలములఁ గెంపుగదుర క్షణకాలమట్లే స్తబ్ధుఁడై నిలు

చుండి, మహారాజుఁగాంచి "రాజకులచంద్రమా! నాతత్వ
మును బూర్తిగా నెరుంగకయే యిట్లాడుట మీవంటి మహాత్ము
లకుఁ దగదు. నన్ను విటునిగా భావింపవలదు. ఎద్దానినైన
సవిమర్శంబుగఁ బరికించిన గాని నిజరూపంబు తేటఁబడఁ
జాలదు. వివిధంబులగు జన్నంబులొనర్చి సోమయాజియని
ప్రసిద్ధిగాంచిన బ్రాహ్మణకులాలంకారభూతుండగు వాత్స్యా
యనుని వంశమున జన్మించితిని. సకాలమునందుపనయనాది
సంస్కారములఁ బొందితిని సాంగోపాంగముగ వేదములను
బఠించితిని. నాశక్తికిఁ దగిన శాస్త్రము లన్నియుఁ జదివితిని.
పెక్కురాజాస్థానములయందసిధారావ్రతులగు పండితుల
పరీక్షలయందు జయమును సంపాదించితిని. గృహస్థాశ్రమ
మును స్వీకరించి సంసారమును సరిదిద్దుకొనుటకు సిద్ధముగా
నుంటిని. నేను విటుఁడనగుటయెట్లు? ఇహపరలోకములయంద
విరోధియగు బాల్యచాపల్య మంతరించినది. నా నిర్దోషిత్వ
మును కాలమే నిర్ణయింపగలదు. పండితసభామధ్యంబున
విచారించి నన్ననుగ్రహింపఁ గోరుచున్నాను.'' అని పలికెను.

హర్షచక్రవర్తి ప్రసాద మేదురంబగు చూడ్కుల
బాణుని ముంచి తేల్చుచు ''మే మట్లు వినియుంటిమి'' అని
పలికి దినకరుఁ డస్తమింప నిజభవనమున కేగెను.

బాణున కాపాదమస్తకము కంపించెను. మొగంబున
విన్నదనంబు దోఁప, చేయునదిలేక మెల్ల మెల్లన పాదంబుల
నీడిచికొనుచు, నిజనివాసముం జేరెను.

పాపము బాలుని కారాత్రి యాహారము రుచింపలేదు. కంటికి నిద్దురయన్నది లేదు. చిత్తక్షోభకవధి లేదు. తనపై నట్లు విషప్రచారము గావించి మహారాజు మనంబు నంతగా మార్చినవా రెవ్వరో? అందువలన వారికేమిలాభమున్నది? మహారాజు నాదరముగ మాటలాడి, యాసన మొసంగి గౌర వించలేదు. కాని, స్నేహాగర్భితములగు చూపులతో ననుగ్రహించెను. వారికి నమ్మకమును బుట్టించి మనస్సు మార్చు టెట్లు? కృష్ణస్వామియు నాసమయంబున నేమియు మాట లాడలేదే, ఏమి చేయుటకును దోచకున్నది. మహారాజు మనంబునకు నచ్చునట్లు ప్రవర్తింపవలయును. ఏమి కాను న్నదో యీశ్వరేచ్ఛ. అని తలపోయఁ జొచ్చెను.

# 6

మరునాఁడు మంత్రి సమేతుఁడై యేకాంతమందున్న మహారాజును దర్శించి, సవినయముగ నమస్కరించి కృష్ణుఁ డిట్లనియె. "అన్నా నిన్న నలుగురిలో మహాపండితు నట్లు పలికితిరి. ఆతని హృదయమెంత గాయపడెనో? రాజ్యమున ధర్మాధర్మములను బరికించి యధర్మమును బారఁదోలి ధర్మ ప్రతిష్ఠఁ గావింపవలసిన మహారాజవు. రామరాజ్యమును మర పించి ప్రజాపాలన మొనరించు కవిపండిత చక్రవర్తివి. ఎవరో యసూయాపరులగు పండితులు చెప్పిన మాటలను నమ్మిన

రాజును ప్రజ లేమనుకొందురు? మహారాజు ప్రజలదృష్టిలో చులకనైన నారాజ్య మెట్లుండును? మీకు నేఁ జెప్పెడిపాటి వాఁడను గాను. ప్రపంచమంతయు బాణుని సరస్వత్యవతార మని భావించుచుండిరి. వాసిమాటయన్న చెవికోసి కొను చుండిరి. చారులను బంపి విచారింపుఁడు, నానా దేశములనుండి పండితులను రావించి సభగావించి స్వయముగా బరీక్షిం పుఁడు. యథార్థము తేట తెల్లమగును'' అని. మహామం త్రియు నట్లు గావించుటయే యుచితమనగా, శ్రీ హర్ష చక్ర వర్తి వల్లెయని వలయు ప్రయత్నములు గావింప కృష్ణునే నియోగించెను.

కృష్ణుఁ డీవిషయ మంతయు బాణునకుఁ దెలియఁ జేసెను. బాణుని యానందమున కవధిలేదు. ఆ ప్రాంతమునందున్న బంధు మిత్రులను గాంచుచు సుఖముగా కాలము గడుపు చుండెను.

సభకుఁగావలసిన యేర్పాట్లు శీఘ్రముగాఁ జరుగు చుండెను. రాజ్యములోని మహాపండితులందఱకు నాహ్వాన ములు పంపబడెను. సభాభవనము పచ్చని తోరణముల తోడను, రంభా స్తంభములతోడను, నానావిధంబులగు పరి మళంబుల వెదజల్లు పుష్పమాలలతో నతి మనోహరంబుగ నలంకరింపఁబడెను. తండోప తండములుగా వచ్చు పండితు లకు విడుదు లేర్పాటు చేయఁబడెను. పట్టణములో నెవరినోట విన్నను బాణుని పాండిత్య ప్రశంసయే వినఁబడుచుండెను.

కవిశేఖరుఁడగు బాణుని దర్శించుటకు పట్టణములోని వారందరును రాజమార్గంబున కిరుప్రక్కల బారులుతీర్చి నిలబడిరి. పురంధ్రీజనులు సౌధాగ్రంబులపైనుండి యహామహమికతోఁజూడ నారంభించిరి. బాణకవి దేవతాంశసంభూతుఁడు, సరస్వతియే యిట్టి రూపుతో భూలోకంబునం దవతరించి యుండును. లేకున్న నిట్టిప్రతిభ మానవుల కెట్లు గలుగును? బాల్యమంతయు నాటపాటలతోడనే గడిపెనట! ఇంతటి పాండిత్య మెట్లువచ్చెనో? వీనితండ్రియు నింతటి పండితుఁడేనట. కాని యింతటి కవితాశక్తి లేదందురు. రాజాస్థానంబులఁ బేరు మ్రోగిన కవులందరును దాసోఽహ మనవలసినదే, మనమహారాజుకూడ గొప్పపండితుఁడేగదా! ఏమగునో? నేఁడీసభ చూచి తీరవలసినదే అని యనుకొను చుండిరి.

నాఁడు బాణుఁడు సరస్వతీ పూజగావించి. "తల్లీ! భక్తవత్సల! నీయనుగ్రహ పాత్రుఁడనగు నాకింతదనుక నపజయ మనునది లేదు. నేఁడేమిచేసెదవో? నిన్నే నమ్మియుంటి నని" ప్రార్థించి సభాభవనంబునకు బయలుదేరెను. ఆయుధపాణులై తురంగముల నధిరోహించి భటులు ముందుపోవుచుండిరి. ముత్యాల పల్లకిలో ముఖమున మందహాస రేఖలు ప్రకాశింప బాణమహాకవి జయమునాదే, యను ఠీవితోఁ గూర్చుండెను. ఆ వెనుక సైంధవంబు నధిరోహించి కృష్ణుఁడును వాని వెనుక నశ్వబలమును పోవుచుండెను. పుర జనుల

జయ జయ ధ్వానంబులు భూనభోంతరాళంబులు మారు మ్రోగుచుండెను. పట్టణములోని స్త్రీ పురుషులెల్లరు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. పండితులు, మంత్రులు, సామంతులు, పురోహితులు వారి వారి యాసనముల నలంకరించిరి. కవియు, మహాపండితుఁడునగు శ్రీహర్ష చక్రవర్తి, ధగధగ మెరయు రత్నఖచిత సువర్ణకిరీటమును ధరించి, ఖడ్గపాణియై రత్నసింహాసనము నలంకరించి యుండెను.

వందిమాగధులు కైవారంబుసేయఁ, పురోహితులు వేదాశీర్వాదములఁ గావించిరి. నాఁడాసభయం దందరిముఖంబులయం దానందము తాండవించుచుండెను. కాని బాణుని గూర్చి చక్రవర్తికి దుర్బోధఁ గావించిన పండితుల ముఖంబులు, దినకరకరప్రసారంబునఁ గైరవంబులవలెఁ గాంతి విహీనంబులై ముకుళితంబులై యుండెను. బాణుఁ డాసనము నుండి లేచి శ్రీహర్ష పంచరత్నముల నాశువుగాఁజెప్పి. చక్రవర్తి కంఠసీమ నలంకరింపఁజేసెను. సభామధ్యంబున జయ జయ ధ్వానంబులు మిన్నుముట్టెను.

శ్రీహర్షుఁడు సహర్షుఁడై తనకు దుర్బోధఁ గావించిన పండితులవంకఁ జూచెను. వారును ఖిన్నులై శిరములవంచి, దేహములు కంపింప, గద్గద స్వరంబులతో "మహారాజ! బాణుఁడు మహాకవి, మహాపండితుఁడు. వాని జయించువారే లోకంబునను లేరు. కవి పండిత పక్షపాతులరగు మీరు వారి

ప్రతిభ విన్నచో, దేవరవారి యాస్థానంబున మాకు గౌర వంబు కొరవడునను తుచ్ఛభావంబు మమ్మావహింప, కవి రాజ శేఖరుఁడగు నీ మహనీయుని గుణగణంబులకు దోష మాపాదించి చెప్పితిమి. మాయజ్ఞానమును సైచి, మమ్ము లను క్షమింపఁ గోరుచున్నాము'' అని పలికిరి. సభ్యులెల్లరు నొకరి మొగంబు లొకరు చూచుకొనుచు రహస్యంబుగా నేమేమో మాట్లాడు కొనుచుండిరి.

హర్ష పులకితుఁడై శ్రీహర్ష చక్రవర్తి సింహాసనము నుండి దిగ్గున లేచి, బాణుని సమీపించి, సాష్టాంగ నమస్కార మొనరించి, పుష్పమాలాలంకృతుఁ గావించి, ''సకల శాస్త్ర పారంగతా! బాణమహాకవీ! తొలుత మిమ్ముల నపార్థము గావించుకొని నందులకు విచారించుచున్నాను. మీ రాకచే మా రాజ్యము ధన్యమైనది. నేటినుండి మీరు మాయాస్థాన కవులై యుండి మమ్ములను ధన్యులగావింపఁ గోరుచున్నాను.'' అని వచించెను. జయ జయ ధ్వానంబులు చెలరేగెను.

అంత బాణుఁడు ''రాజాధి రాజ శ్రీహర్ష దేవ! మహాకవులు, పండితులు, రసజ్ఞులునగు తమ కొలువున కీయ కొనుట నాపూర్వ జన్మసుకృత విశేషంబుగా భావించుచుం టిని. నాజన్మ చరితార్థమైనది. ఇంతకన్న నాకేమికావల యును. తమయాజ్ఞ శిరసావహించితిని. అని మహారాజునకు నమస్కరించి, పశ్చాత్తప్తులరగు నీపండితోత్తముల మన్నింప

ప్రార్థించుచున్నాఁడను" అనెను. మహారాజు "అట్లే యగుగాక" అని పరిచారకులు తెచ్చిన బహువిధ రత్నాలంకారంబులు, దుకూలంబులు బాణున కొసంగి, సింహాసనముపై నధిష్ఠించి, మహామంత్రిని గాంచి "ఆస్థానపండితులకు ప్రత్యేక భవనంబున రాజమర్యాదలు జరుగునట్లు చేయుఁడని" యాజ్ఞాపించెను.

కృష్ణుని యానందమున కవధిలేదు. బాణుని రాజలాంఛనములతో ప్రత్యేకభవనంబునకుఁ గొనిపోయిరి. ప్రతిదినము మహాకవి, రాజాంతఃపురమునకేగి చక్రవర్తితో న్యాయ, మీమాంస, వ్యాకరణాది శాస్త్రంబులం జర్చించుచు, రాజోపభోగంబులఁ గాలమునుగడుపు చుండెను.

అంతనొక్క శరత్కాలంబున బాణుఁడు రాజాజ్ఞఁగొని బంధుమిత్రాదుల దర్శించుటకు సపరివారముగ బయలు దేరెను. మార్గమధ్యంబున విశ్రాంతికై విడుదు లేర్పాటు గావింపఁబడెను. కతిపయ ప్రయాణంబులుగావించి ప్రీతికూటమును జేరునంతలో బంధువులు, పురప్రముఖు లెల్లరు నెదురుగావచ్చి బాణుని సగౌరవంబుగఁ గొనిపోయిరి. మహారాజుచే బహూకరింపఁ బడిన నానావిధామూల్య వస్తుజాలంబులఁగాంచి బంధువులెల్లరు. బాగడుచుండ సంతోషచిత్తుఁడై కాలమును గడుపుచుండెను.

ఒక్కనాడు భోజనానంతరము బంధుమిత్ర పరివృతుం డై యున్న బాణునిగాంచి పితృవ్య పుత్రుండగు శ్యామలుఁ డాదరముతో అన్నా! "సకలజన సంస్తూయమానుండును, బుణ్యరాశియునగు శ్రీహర్ష చక్రవర్తి చరితమును వినఁగోరు చున్నాము. సాకల్యముగఁ జెప్పి మమ్ముఁ గృతార్థులఁ జేయఁ గోరుచుంటిమ"ని వేడెను.

బాణుఁడు మందహాసము గావించి తాత! "నీకోరిక నాకతీతమైనది. శక్యాశక్యములను గమనింపకయే కోరితివి. నుడువదగిన విషయము లధికముగాఁగలవు, పదజాలంబులత్య ల్పము. పురుషు నాయుఃప్రమాణమున్నంతవరకుఁ జెప్పిన నామహనీయుని చరిత్రతరుగదు. అందేకదేశము మాత్రమే చెప్పఁగలను. అల్పాక్షర జ్ఞానియగు నామతి కంతకన్న సాధ్యముకాదు. మోహాతిరేకంబునఁ బా ర మె ఱుం గ ని పయోధిఁదెప్పచే దాటప్రయత్నించు వానివలె, ధైర్యముతో నీఘనకార్యమునకు సాహసించుచుంటిని. వినువారలు రసజ్ఞు లగు బంధుమిత్రాదులు; చెప్పునది శ్రీహర్షచక్రవర్తి చరితము. ఇంకేమికావలయును ? ధన్యుఁడనైతిని." అని వారియెదుట హర్షచరితము నభివర్ణింప మొదలిడెను. అదియే యనన్య సాధారణ రచనా విశేషముగల మహాగ్రంధమయ్యెను.

తరువాత కొంతకాలమునకు కాదంబరి యనుగ్రంథ రాజమును వెలయించెను. అందలి వర్ణనా విశేషము లద్వి

తీయములు. తాదృశగ్రంథరాజము నభూతో నభవిష్య కావుననే “బాణోత్సిష్టం జగత్సర్వమ్” అని జగద్విఖ్యా గాంచి, సాటికవులలో మేటియై విలసిల్లిన బాణుఁడు చుక్క-నడుమ చంద్రునివలె ప్రకాశించిన యమరజీవి.

జయన్తి తేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాం యశః కాయేజరామరణజంభయమ్.

శ్రీ శ్రీ శ్రీ
శ్రీ



శాన్తిశ్రీ ప్రెస్, అగ్రహారము, గుంటూరు-1